ఉ. కిన్నెర మీటుచు న్వగలఁ గేరి యలంతిగఁ బాటఁ బాడు
చున్, సన్నలు సేయుచు న్బిగుపుచన్నులపైఁ గను వేసి డా
యుచున్, సన్నక నన్నుఁ బూఁబొదలచాయకు రమ్మని వేడు
నీహొయల్, గన్నులఁ గట్టినట్టు లగుగద్దరిజంగమరాయ
సారెకున్. 33

ఉ. ఇందునిభాననామణుల నెందఱి నెందఱి ము న్భ్రమించి శ్రీ
నందనుఁ బాఱఁద్రోచితివి న న్నటుల న్వలయించి నెమ్మదిం
గొందల మందఁజేసి యెటకో చనుదెంచితి నీతుటారపుం
జంద మెఱుంగనైతిఁ గద జంగమరాయ సతీమనోహరా. 34

క. మారాశుగశుకమధులి
ట్పారావతపికను రాళబర్హిమరున్నీ
హారాంశులసడి కళికెద
రారా నన్ బ్రేమ నేలరా రభసమునన్. 35

తే. పూలు పన్నీరు గందంబుఁ బోఁక లాకు
లనఁటిపండులుఁ జక్కెర యగరుఁ గప్పు
రంబుఁ గస్తురిఁ గూర్చి యర్చన లొనర్తు
రార వైళంబ జంగమరాయ యిపుడు. 36

వ. అని వగలం బొగులుచున్నమగువం గనుంగొని సఖీశిఖామ
ణులు దమలో నిట్లనిరి. 37

తే. కూళజంగంబు వాలారుగోళ్ల నిండ
వలపుమందేమొ చల్లి యిక్కలికి నిట్లు
మరులు గొల్పెను గాఁబోలు మాయగాండ్రు
జోగులను నమ్మవచ్చునె సుదతులార. 38

తే. ప్రేతభూములఁ దిరుగుచు భూతకోటి
వెంటఁ జనుదేర వేల్మిడి యొంటిఁ బూసి
తోళ్లు బుసుకలు నెమ్ములు బెల్లు దాల్పు
జోగులకు మందుమంత్రముల్ జోలెనుండు. 39

వ. అని గంగం గనుంగొని. 40

తే. ఏమె నీ నెమ్మనాన సిగ్గింత లేక
వాసిఁ దిగనాడి పొగలెదు గాసిఁబడుచుఁ
బెద్ద లెన్నంగఁ దగిననీబుద్ధి విడిచి
చిడిపిజంగంబు దా నేమి సేసెనొక్కొ. 41

తే. తల్లిదండ్రులు గులము పెద్దలును మఱియుఁ
దగినచుట్టంబులును విన్నఁ దప్పు కాదె
చిన్నదానవు నీ విట్లు సిగ్గుమాలి
పలుదెఱంగుల నోరలంగఁ బాడియగునె. 42

క. కటకట పిడికెడుకూటికిఁ
గోటికెలఁ బడి బికిర మెత్తుకొని మనియెడు న
ష్టటుమాయజంగమునకై
యిటువలెఁ గృశియింపఁదగునె యిందునిభాస్యా. 43

తే. వద్దు మాయమ్మ యిఁక మంచిబుద్ధి గలిగి
దత్తురపుజంగమయ్యపైఁ దలఁపు విడిచి
నెమ్మినుండుము శుభములు నివ్వటిల్లు
జోగు లెచ్చట నాడెంపుజోటు లెచట. 44

సీ. కటకట నాఁకటఁ గస్తి వొందఁగ నేల
వెసఁబట్టి దోరెంబు మెసఁగరాదె

యొడలెల్ల బిగిదప్పి బడలి యుండఁగ నేల
యగరుగస్తురిగంధ మలఁదరాదె
సొగసెల్ల విడిబాఱి వగలఁ గుందఁగ నేల
వెలలేనిరవణము ల్పెట్టరాదె
తలయెల్ల జడగట్టి మలిన మొందఁగ నేల
తీరుగాఁ గ్రొమ్ముడి దిద్దరాదె
తే. గట్టివలిపట్టుపుట్టము ల్గట్టరాదె
చెలఁగి కపురంపుఁదములంబు సేయరాదె
దావిక్రొంబువ్వుసరములఁ దాల్పరాదె
యువిద నీ కిది యేలాటియోజ చెపుమ. 45

చ. చిలుకలఁ గొట్టెదేమి దరిఁ జేరినబోటులఁ దిట్టెదేమి పె
న్వలపులఁ బొక్కెదేమి తలవంచి మదిం గడుఁ జొక్కె
దేమి యూర్పుల నిగుడించెదేమి కనుబ్బొమలసారె ముడిం
చెదేమి హా, చిలుకలకొల్కి నీవెడఁగుచిన్నియ లిన్నియుఁ
జెప్పఁ జిత్రముల్. 46

వ. అనిన వారల కాకన్యకామణి యిట్లనియె. 47

క. చెలులార యింతనెగ్గులు
వలుకంగా నేల లచ్చికొమరుని కెనయౌ
చెలువము గలయవ్వలఁతికి
వలసితి మీతోడ నింక వాదము లేలా. 48

తే. వినుఁడు నామాట మీరెల్ల వీను లలర
నలినముఖులార నాప్రాణనాథుఁ డైన
జంగమస్వామిఁ దెచ్చి యోర్వంగరాని
మదనవిశిఖార్తి మరలించి మనుపరమ్మ. 49

ఉ. బంగరుపట్టుపుట్టములు భాసురరత్నవిభూషణంబు లు
ప్పొంగఁగ మీకు నిచ్చి పరిపూర్ణకృపామతి నాదరింతు నా
లింగముతోడు నాపలుకు లెస్సగ నమ్ముఁడు బోటులార యా
జంగమరాజశేఖరుని జయ్యన నిచ్చటఁ దెచ్చి నిల్పుఁడీ. 50

క. ఇవ్విధము గాకయుండిన
నవ్వుల ఱవ్వలఁ బెనంచి యందఱిలోనన్
నవ్వులఁ బెట్టక యూరకె
పువ్వారంబోఁడులార పొం డిరువులకున్. 51

మ. కులమెల్ల న్నిరసించి గేలి యిడ నీకోపంబు దీపింప మా
తలిదండ్రుల్ నిలయంబునం దిడక పంతంబారఁ బోఁదోల నీ
చెలికత్తెల్ మఱి మీర లందఱును ఛీఛీ యంచుదూషింపనీ
వలఱేనిన్నగువానికౌఁగిటను నే వాలంబు గ్రీడించెదన్. 52

వ. అని కనరుగనంబడం బలికిన నళికి చెలికత్తియ లొండొరు
లమొగంబులు చూచుకొనువారును, గుజగుజలం బోవువా
రును, సళించువారును, నీసడించువారును,నిదె మిడిమేళం
బనువారును నై యుండి యలసి కొంతతడవున కించుక
గనుమూసి నిదురింపం దొడంగి రాసమయంబున. 53

త. గంగయుఁ గడితపువలువచె
ఱంగు ముసుంగిడి కడిందిఱాతనమున నా
శృంగారవనికి మెల్లనె
జంగమపుంగవుని వెదుకఁ జనియె నొకర్తె. 54

వ. అట్లు చని వనిం బ్రవేశించి 55

సీ. కొనగకగాటంపుఁబొదరిండ్లదండలఁ
గొదకొని సారెకు వెదకి వెదకి

తిన్ననికపురంపుఁదిప్పలచొప్పుల
నిలుచుచు నందంద నెమకి నెమకి
వలపుగొజ్జఁగనీటివంతల చెంతల
డాసి పల్లెటెంగుల రోసి రోసి
పరువంపువలిదాఁక పందిళ్లసందుల
సొలయుచు మఱిమఱిఁ జూచి చూచి
తే. వలపు లంతంత కుబ్బ నవ్వన్నెకాని
నెందుఁ బొడగాననేరక కుంది కుంది
యిందువదన వనీతరుబృందములను
ఆశ లడరంగ నిట్లని యడుగఁదొడఁగె. 56

సీ. చిన్నారివగకాఁడు చెన్నార మీవద్ద
నిలిచియుండఁడుగదా నిమ్మలార
సింగారములకుప్ప చెలువొప్ప మీచెంద
మొనసియుండఁడుగదా పనసలార
ముద్దుజంగమఱేఁడు ముదిమీఱి మీపజ్జ
మసలియుండఁడుగదా మావులార
నెఱజాణతలమిన్న నీటార మీచెంత
దాఁగియుండఁడుగదా దబ్బలార
తే. యలరువిలుకానిఁదెగడుసోయగము గలిగి
కడిఁదిమీచాయనిగ్గులు కడలఁ బర్వ
జగములెల్లను వలయించుజగమగండు
మీకడకు రాఁడు గద వలిదాఁకలార. 57

క. ఈ డెన్నరానిసొగసుల
నాడెందము గరఁగఁజేసి నలిఁ బెట్టినయా

పోఁడలతలమానిక మిపు
డీడా నీనీడ కీడ కేతేరఁడుగా. 58

క. అన్నన్న కడిఁదివగలన్
నన్ను న్వలయించి చనుట నాయమె వానిం
గన్నారఁ జూపఁగదవే
పొన్నా నీ కెన్నరానిపుణ్యంబు గదే. 59

క. జగమెల్లను వలయింపఁగఁ
దగుసోయగమున వెలుంగుదంటవిరాళిం
బొగలించి చనియె వానిం
బొగడా గనఁజేయునీకుఁ బొగడిక వచ్చున్. 60

తే. తలిరువిల్కానిదాడికి నళికి యుళికి
పలుదెఱంగుల నినుఁగోరి వలసియున్న
చెలియ నలయింపఁ దగదని తెలిపి వాని
నగుపడఁగఁ జేయరే కొమ్మనఁటులార. 61

వ. అని మఱియును జంగమేశ్వరుంగురించి యిట్లనియె. 62

ఉ. ఏలర యింతవింతచలమేలర నన్ను మనోభవానల
జ్వాలలవేఁడిమిం బొగలఁ జాలర లేజవరాలరా మదిం
జాల దిగు ల్దగుల్కొనియె జాలముసేయక వేగవచ్చి నా
మ్రోలఁగనంబడం గదర ముద్దులజంగమరాయ మ్రొక్కెదన్.

ఉ. పొంగుచునీముఖాంబుజము ప్రొద్దునఁజూచినవేళ యెట్టిదో
యంగజుఁ డెంతయుం గుపితుఁడై వెనుదీయక యేఁచఁ జొచ్చెన
న్నంగవలం గలంచి యిటురా రెదఁబెట్టిదవేల చాల నీ
సంగతిఁ గోరుకొంటిఁగద జంగమరాయ విలాసభాసురా. 64

తే. అనుచు వనమెల్లఁ దిమ్మరి యందు నెచట
జంగమస్వామిఁ గానక గంగ యలసి
చాల నొప్పారుబాలరసాలసాల
మూలమునఁ గొంగుపఱచి కన్మూసియుండె. 65

క. మఱఁ దపు డిందీవరసర
సీరుహసితోత్పలామ్రశితవిశిఖంబుల్
పోరిఁబోరి వెసవింటఁ దొడిగి
కరిగామినిఁ బింజెపింజె గాఁడఁగ నేసెన్. 66

క. అటువేసిన హా యని య
క్కుటిలాలక సోలి తెలిసి కుసుమాస్త్రనిశా
విటమధుకరహంసకుహూ
రటమలయానిలులఁ గినుక ప్రబ్బఁగఁ బలికెన్. 67

తే. పార్వతీశంకరులమీఁదఁ బఱచి మున్ను
బన్నమందిన సుద్దిలోపలను మఱచి
యిప్పుడు నామీఁదఁ దొడిగెద విక్షుచాప
మింకనీవేమియయ్యెదో యెఱుఁగ రాదు. 63

క. సోమా నీవును నేనును
గామాంతకుశిరముమీఁదఁ గలసి మెలసి మున్
ప్రేమమున నుందు మిప్పుడు
నామీఁద న్వేఁడిచూప నాయమె నీకున్. 69

సీ. మరుని శంభునికంటిమంట మ్రింగెడునాఁడు
తాఁటి మీ రేభొక్క దూఱినారు
దర్పకుఁ డభవుచే దగ్ధుఁ డయ్యెడునాఁడు
తలఁగి మీ రేయెటఁ గలసినారు

వలరాజు హరునిచే నలిగిపోయిననాఁడు
సురిగి మీ రేకోనఁ జొచ్చినారు
మదనుఁ డీశ్వరునిచే మడిసి పోయిననాఁడు
పారి మీ రేతిప్పఁ బట్టినారు
తే. వాఁడు గ్రమ్మర జీవించి వచ్చినపుడు
సిగ్గులే కిట్లు వెంబడిఁ జేరినారు
మధుపచక్రాంగపరభృతమలయపవను
లార గణుతింపఁదరమె మీబీర మిపుడు. 70

వ. అని యని వారితానంగసంతాపాటోపంబునం బొరలుచుండె
నంత. 71

తే. ఆత్మగృహమున నక్కడ ననుఁగుచెలులు
త్రుళ్లిపడి లేచి సెజ్జయు నెల్లచోట్లు
వెదకి గంగనుగానక వెఱఁగుమీఱ
వరుస నందఱు శృంగారవనము సొచ్చి. 72

సీ. కందర్పశరబాధఁ గుందుచు నందంద
శివశివా యని సద్దు సేయుదానిఁ
బొగలుచు గడితంపుబుడిబుడి వేఁడిక
న్నీటిజాల్ కొనగీర మీటుదాని
నెందు నల్కుడువిన్నఁ బొందుగాఁ జెవియొగ్గి
పొంచి నల్గడ లాలకించుదానిఁ
బొరిఁబొరి నిలమీఁద బొరలుచు లేచుచు
నుసురంచు నిట్టూర్పు లుచ్చుదానిఁ
తే. గమ్మకపురంపుబలుదుమారమ్ము చిమ్మి
క్రమ్ముకొని వీచువలినాతెమ్మెరలకు

నడలి యొడ రార గడగడవడఁకుదానిఁ
జిన్నికన్నియఁ గాంచి రాచిగురుఁబోండ్లు. 73

తే. కాంచి మెల్లన దరి కరుదెంచి లోని
జడుపుదీరంగఁ బుప్పొడిఁ దడిసి వైచి
మెదవుగపురంపుబూఁది నెన్నుదుటఁ బెట్టి
యిందుబింబాననలు దాని కిట్టులనిరి. 74

ఉ. అమ్మకచెల్ల నీ విటుగయాళితనమ్మున మమ్ముఁ బిల్వకే
యుమ్మురమైనవేదలన మున్గుచు నీవదురేయిఁ గోనకున్
నెమ్మది నొంటి రాఁదగునె నీమనిలో నళుకేల లేదె వా
కొమ్మ వచింపఁ జిత్రము లగుంగద నీదుకడిందిచందముల్. 75

క. చిలుకలు గోరువంకలు గో
యిల లంచలు నెమలిగములు నెడపక యెపుడున్
గొలగొలలాడుచు విరహుల
నిలువఁగ నిచ్చునె వనంబు నీకుం గోఱయే. 76

తే. కొసరి యిట్టి పుప్పొడి కేలుగొనుచు నొక్క
యెడను గాలూనఁ గందదు బడి చరించు
జోగి జంగాల కిరవైనచోటు గదవె
పడఁతి యింక వానిపై నాస విడిచిరమ్ము. 77

తే. అమ్మ నీయింట సకలభాగ్యములు గలవు
దండ్రి యందఱిలో నెన్నఁదగినధనికుఁ
డింకఁ దగుచోటఁ గల్యాణ మెలమిఁ జేయు
వద్దురావమ్మ యింటికి బుద్ధి గలిగి. 78

వ. అని యూరడించి నెచ్చెలు లచ్చేడియ నింటికిం దోడ్కొని
తెచ్చి యిష్టగోష్ఠీప్రకారంబులఁ బ్రొద్దుగడపుచుండి రంత. 79

ఆ. వేగుఁజుక్క పొడిచె విడువక తామ్రచూ
డంబు లఱచె నిరులడంబు మాసెఁ
దూర్పు దెల్లవారెఁ దోయజమిత్రుండు
పొడవుగొండమీఁదఁ బొలుపుచూపె. 80

ఉ. అప్పుడు బోటినెచ్చెలులు పాళిని దాసకులాగ్రగణ్యుఁడై
యొప్పెడుశంఖదేవుకడ నొయ్యనఁ జేరి కుమారిచందముల్
దప్పక చొప్పడం దెలిపి తా రట నేఁగిన నాతఁ డాత్మలోఁ
ముప్పిరిగొన్న యంగదల మున్గుచు నేమియుఁ దోఁచకుం
డినన్. 81

తే. కొంతతడవు విచారించి కూఁతుఁ బిలువఁ
బంచి కూర్చుండ నిడి బుజ్జగించి యొడలు
దడవి ముద్దాడి కొండొకతడవునకుఁగు
మారికామణిఁ గాంచి ప్రేమమునఁ బలికె. 82

క. అమ్మా నీతలఁ పేమియు
సమ్మతి గాకున్న దిపుడు స్వాంతంబునకే
నిమ్మాట విని కలంగుచు
రమ్మని పిలిపించినాఁడ రయమున నిన్నన్. 83

తే. తల్లి నీ వేమిగోరినఁ దగిలి సేతుఁ
గాని యిక్కానిపని సేయఁ గాదు సుమ్ము
కేరి మఱి యెద్దియైనఁ గాంక్షింపఁ బోక
చిడిపిజంగమువానిఁ గాంక్షింపఁ దగునె. 84

క. కులమునఁ గలపెద్దలు విని
వెలిపెట్టినఁ గూడి పొత్తు విడనాడిన హా

తలవంపు లయ్యెడుం గద
చెలియా యీలాటిబుద్ధి చెల్లునె నీకున్. 85

క. కులమును రూపంబును గల
చెలువుని రప్పించి పెండ్లిసేసెద నీకున్
జలజాక్షీ గానిబుద్ధులు
వల దిఁక నామాట వినుము వాలాయముగన్. 86

వ. అనినం దండ్రికి గంగ యిట్లనియె. 87

ఉ. పొంగుచు మూఁడులోకములఁ బూనికతో విహరించి
పాపముల్, భంగ మొనర్చుచు న్భువనపావని నా విలసిల్లు
జాహ్నవీ, గంగను గాని నే మనుజకన్యను గాను నిజం
బతండునున్,జంగమవాఁడు గాఁ డలభుజంగమరాజకలాపుఁ
డారయన్. 88

తే. తండ్రి యిమ్మాటఁ గొంతచిత్తమున నీ వె
ఱింగినది గాక యూరక ఱిచ్చపడక
యతనిరప్పించి వెస వివాహం బొనర్చు
నిఖలవాంఛాఫలంబులు నీకుఁ గలుగు. 89

క. ఇటువలెఁ గాకుండిన నా
నిటలాక్షునిపాద మాన నీయాన మఱేం
తటిబలవంతునినైనను
గటకట నే నింక నొరుని గాంక్షింపుదు నే. 90

వ. అనిన సంతసిల్లి శంఖదేవుండు వెండియుఁ గూఁతున కిట్లనియె.

తే. అమ్మ యిమ్మాట నిక్కువం బయ్యెనేని
నతఁడు నిజమూర్తిఁ జూపించి యఖిలదివిజ

వర్గములఁగూడి యింటికి వచ్చెనేని
ప్రేమ దైవార నే నిన్నుఁ బెండ్లి సేతు. 92

క. విను మూరక నిన్నొసఁగిన
జనులందఱు నవ్వఁ గులముసాములు నన్నుం
గనుఁగొని యొగ్గులు వల్కరె
వనితా నీ వెఱుఁగనట్టివల నిఁకఁ గలదే. 93

ఆ. అనిన సంతసిల్లి యప్పుడు గంగాభ
వాని యభవు నాత్మలోనఁ దలఁచి
కరయుగంబు మోడ్చి స్థిరభక్తి దైవార
వినయసరణి నిట్టు లనుచుఁ బలికె. 94

సీ. సకలలోకారాధ్య సర్వజ్ఞ సర్వేశ
గిరిసుతాప్రాణేశ దురితనాశ
భూతభావన పరంజ్యోతిస్స్వరూప మ
హాదేవ శంకర హర మహేశ
జగదవనాధార నిగమాంతసంచార
ఫాలలోచన భర్గ నీలకంఠ
నందివాహన భృంగినాట్యప్రమోద గీ
ర్వాణసంస్తుత్య పురాణపురుష

తే. నాదబిందుకళామయ వేదవేద్య
చక్రధర బాణభక్తరక్షాధురీణ
నామనోనాథ కైలాసనగనివాస
వేడ్క నవధారు దేవ నావిన్నపంబు. 95

తే. దేవ మాతండ్రి యగుశంఖదేవుఁ డిపుడు
నాకు నీకును బెండ్లి యొనర్పఁ గోరి

తివురుచున్నాఁడు బ్రహ్మాదిదివిజవరులు
దవిలి గొలువంగ వేవేగఁ దరలిరమ్ము. 96

తే. నీకు నామీఁదఁ బ్రేమంబు నెరయఁ గల్గె
నేని నే నీకుఁ బ్రియురాలనేని యిపుడె
పేర్మిదైవార జాలారివిభునిమ్రోల
నిలిచి నామాట సత్యంబు నెరపవయ్య. 97

వ. అని గంగ ప్రార్థింపుచున్న సమయంబున. 98

సీ. హరియు బ్రహ్మయుఁ బురందరముఖ్యదిక్పతుల్
గవిసుధాకరముఖగ్రహపతులును
సనకాదియోగికుంజరులు వశిష్ఠాత్రి
మైత్రావరుణిముఖ్యమానివరులు
వీరభద్రకుమారభైరవభృంగిరి
టాదిప్రమథనాథు లప్సరసలు
గరుడకిన్నరయక్షగంధర్వఖచరగు
హ్యక నాగసిద్ధవిద్యాధరులును

తే. బలసి కొలువంగ నసమవైభవముతోడ
నందికేశ్వరు నెక్కి యానందలీల
సకలలోకాధిపతి యైనసాంబశివుఁడు
దాసకులమౌళిమ్రోలఁ బ్రత్యక్షమయ్యె. 99

వ. అట్లు సాక్షాత్కరించిన దాక్షాయణీవల్లభుం బొడఁగాంచి
పులకితాశేషావయవుండును, నిర్భరానందరసోత్ఫుల్లనేత్రుం
డును, విస్మయాకులస్వాంతుండును నగుచు దాసకులజ్యే
ష్ఠుండు సాష్టాంగదండప్రణామంబులు గావించి బహుప్ర
కారంబుల వినుతించి కృతాంజలి యై యిట్లనియె. 100

తే. అభవ నాభాగ్యమహిమ శక్యంబె పొగడ
హరిపురందరకమలాసనాదులకును
గనఁబడగరానినిన్ను నేఁ గంటి నిపుడు
పావనం బయ్యె నహహా నావంగడంబు. 101

తే. నీచకులయింటి కిప్పుడు నీవు వచ్చి
యొనరఁ గన్యార్థివై నిల్చియున్న వాఁడ
వేతెఱంగున నిన్ను సంప్రీతుఁజేసి
యనుపఁ గలవాఁడనయ్య చంద్రోత్తమాంగ. 102

వ. అని విన్నవించి యొక్కదివ్యమణిమయమందిరంబున విడి
యించి, సకలబుధబాంధవామాత్యపురోహితసుహృజ్జనం
బుల రావించి, శుభముహూర్తంబు నిర్ణయించి, నిజగృహా
దికం బలంకరించి తదనంతరంబున. 103

సీ. శుభతూర్యనినదంబు లభినవస్థితి మ్రోయఁ
గరదీపికాసముత్కరము వెలుఁగ
ద్విజసతీమణులు ముత్తైపునేసఁబ్రాల్ సల్ల
నుర్వీసురేంద్రు లాశీర్వదింప
గణికానికాయ మగ్గలికనృత్యంబాడ
వనజాతముఖులు నివాళు లొసఁగ
వందిమాగధులు కైవారంబు లొనరింప
గాయకుల్ గానవైకరులు నెరప

తే. మంగళద్రవ్యములఁ గొంచు మఱియుఁ బుణ్య
కాంత లరుదేర నత్యంతకౌతుకమున
సకలబుధబాంధవాశ్రితసహితుఁ డగుచు
భవు నెదుర్కొనెఁ గైవర్తపరిభృఢుండు. 104

వ. అప్పుడు మహాదేవుండు దివ్యదుందుభిధ్వానంబులును, గంధర్వకిన్నర గానంబులును, రంభోర్వశీప్రముఖాప్సరస్సరోజాస్యాలాస్యావధానంబులును, జండీశ్వరప్రపదితగద్యపద్య విధానంబులును, దివిజర్షభప్రవర్షితదేవతరుప్రసూనంబులును, దేవవిమానంబులును, నిరంతరమహోత్సవలీలామహార్ణవత్ప్రమథభటసంతానంబులును, బృందారకసుందరీసందోహ పరివేష్టితచిత్రమణివితానంబులును, నమానంబులై చెలంగ నందికేశ్వ రారూఢుండై, యభినవవైభవంబున శంఖదేవునగరు బ్రవేశించి, యచ్చట వాహనంబు డిగ్గి, వివాహమంటపాభ్యంతరంబుసొచ్చి, సముచితపీఠాగ్రంబున సుఖాసీనుఁడై యున్న సమయంబున. 105

ఉ. అంగన లొక్కకొందఱు ప్రయత్నముతోడ నలంకరించియు
త్తుంగవివాహవేదికి వధూమణిఁ దోడ్కొనితెచ్చి వేడ్క ను
ప్పొంగుచునున్న యాచకులుభూసురముఖ్యులునప్పు రాంతకుం
గంగను బెండ్లిపీట నిడి కంకణముల్ దగఁగట్టి రంతటన్. 106

తే. శంఖదేవుండు దేవతాసార్వభౌముఁ
డగుమహాదేవునకుఁ బ్రియం బలరఁ గాళ్లు
గడిగి తనముద్దుబిడ్డను గంగ నపుడు
ధారవోసె నిలింపబృందములు వొగడ. 107

వ. అప్పుడు. 108

సీ. సిరియును వాణియుఁ జెలఁగి సేసలఁ జల్ల
గురుఁ డొజ్జయై లగ్న మరసి తెలుప
హరియు బ్రహ్మయుఁ బెద్దలై పనుల్ సమకూర్ప
శ్రుతివాక్యములు వసిష్ఠుఁడు వచింప

శచియు నరుంధతీసతి నివాళు లొసంగ
రంభోర్వశులు వింత రవళి నాడఁ
దుంబురునారదుల్ దొడగి గానము సేయ
దేవదుందుభులు మేల్ తీవి మెఱయ

తే. హర్షమున విశ్వకర్త దా నందియిచ్చు
కనకమంగళసూత్రంబు గంగయరుతఁ
గట్టి శుభ మొందె నసమానగరిమ మెఱయ
సకలభువనాధిపతి యైనశంకరుండు. 109

తే. హారునితలఁ గంగయు న
త్తరుణిశిరంబున హరుండు దమిమీఱఁగ వా
విరిము త్తెపుఁదలఁబ్రా లో
సిరి చిఱునగవులు దలిర్ప శివకరలీలఁ. 110

వ. అట్లు విధ్యుక్తప్రకారంబున వివాహం బొనరించి, కంకణ
బంధంబు వెడలించి యున్నంత నొక్కనాఁ డొక్కశుభ
ముహూర్తంబున. 111

సీ. ఘనసారహిమనీరగంధసారమసార
మృగనాభికామోద మేదురంబు
మణిమయపర్యంకమంజూషికాసాల
భంజికాపుంజవిభ్రాజితంబు
తపనీయముక్తావితానకళావికా
వ్యజనదర్పణచామరావృతంబు
కాలాగరుదశాంకకాళికసామ్రాణి
కాధూపవాసనాగంధిలంబు

తే. వీటికావేటికాజాలవిలసితంబు
కజ్జలకరండమండలాఖండరత్న
దీపసంతానదీపితోద్దీపితంబు
నైనయొకకేళికాగృహాభ్యంతరమున. 112

క. మదనవిభంజనుఁ డలిస
మ్మదహృదయాంబురుహుఁ డగుచు మహిళామణికై
యెదురెదురు చూచుచుండఁగ
మదవతు లాకకొంద రపు డమందప్రేమన్. 113

తే. బాలికామణిఁ గైసేసి పడకటింటి
కెలమితోఁ దోడుకొని చని యిందుమౌళి
యొద్దఁ గదియించి తమ్ములం బొసఁగఁజేసి
చనిరి సన్నకసన్న నాశంభుఁ డపుడు. 114

తే. చిగురుఁబోఁడిని సెజ్జకుఁ దిగిచి బుజ్జ
గించి కౌఁగిటఁ బెనచి కోర్కెలు దలిర్పఁ
గామశాస్త్రోక్తనియతి నక్కంజముఖిని
రతులఁ గరఁగించి సుఖలీలఁ గ్రాలుచుండె. 115

వ. అట్లు నవోఢాసంగమ సౌఖ్యానుభవ లీలావైభవంబునం
జెలంగుచుఁ, గొన్ని వాసరంబు లచటనుండి, యంతట
నొక్కనాఁడు యథాస్థానంబునకు వేంచేయ నుద్యోగించి
మహాదేవుండు శంఖదేవున కత్తెఱం గెఱింగించిన నతం
డిట్లని విన్నవించె. 116

క. దేవా నాకుల మెల్లను
బావనమై వెలసె భక్తపాలన విద్యా

ప్రావీణ్యం బేర్పడఁగా
నీ విచ్చటి కరుగుదెంచి నిలుచుటకతనన్. 117

క. దేవ మాయింట నెప్పుడు నీవు నిలిచి
యుండవలె నను కోర్కె లో నుండునాకు
వెఱతు నిమ్మాట మీతోడ విన్నవింప
నింక మీచిత్త మెట్టిదో యెఱుఁగనేర. 118

క. మా కిట నీ వల్లుఁడవై
ప్రాకటగతి నిలిచియున్న భాగ్యంబునకున్
లోకు లెఱుంగఁగ నన్నుం
జేకొని ధన్యునిగఁ జేయు సితకరమకుటా. 119

ఆ. అనిన మెచ్చి శంభుఁ డటులేనిదివ్యజ
లాపహారలింగరూపి నగుచు
నీగృహమున నుందు నిశ్చలభక్తితో
నన్ను గొలుచుచుండు నయవిచార. 120

వ. అని యతండు గోరినట్లనె కృపఁజేసి మన్నించి యతని న
చ్చట నుండ నియమించి మహోత్సాహంబున. 121

తే. అభవుఁ డప్పుడు దివ్యదుందుభులు మెఱయఁ
బ్రమథవరులును దివిజులు బలసికొలువ
గంగతోఁగూడి వృషరాజగమనుఁ డగుచు
లీల వేంచేసెఁ గైలాసశైలమునకు. 122

ఉ. అంతకమున్న నారదమహామునివర్యుఁడు వెండికొండ కే
కాంతముగాఁగ నేఁగి గిరికన్యక గన్గొని యంబ శూలి దా
సంతసమొప్ప గంగ యనుజాలరికన్నియఁ బెండ్లియాడి నీ
చెంతకు వచ్చుచుండె నిదె చెప్పితి నీకు సవిస్తరంబుగన్.

క. అని దివిజమునివరేణ్యుఁడు
వినిపించి యథేచ్ఛ జనిన విస్మయ మొదవన్
మనమున హిమవద్భూధర
తనయ దిగుల్ పూని తద్దఁ దలఁచుచు నుండెన్. 124

సీ. అంతట శంకరుఁ డఖిలామరుల యథా
స్థానంబులకుఁ బంచి సరభసముగ
గౌరికి వెఱచి యాగంగను జడలలో
నిడుకొని నగరున కేఁగుటయును
గొరకొరతోడ నక్కుధరేంద్రనందన
తలుపులు బంధించి చల మెలర్ప
మీనాంకదమనుని లోనికి రాకుండ
నతికఠినోక్తుల నాడుచున్న

తే. మదిఁ గలంగి పురారి యమ్మధురవాణి
కిట్టు లని పల్కె నహహా నీ కిట్టికినుక
యేల నామీఁదఁ బొడమె నే నేమితప్పు
చేసితి వచింపఁగదవె నాచెంత నిపుడు. 125

క. భక్తపరాధీనుఁడ నే
భక్తుల నరయంగఁ గోరి ప్రతిదివసము నా
సక్తిని దిరుగుచు నుండుదు
వ్యక్తావ్యక్తుండ నగుచు వనజాతముఖీ. 126

వ. కావున నాకుం దప్పుగా విచారించికవాటబంధనం బొనరించు టుచితంబె యనిన నతనికి భవాని యిట్లనియె. 127

తే. ఎచటి కేగితి విందాఁక నెచట నుంటి
వెవ్వడవు నీవు నీతెఱం గేనెఱుంగఁ

గ్రొత్తపెండిలికొడుకులాగునఁ గడింది
సొగసు గైకొనియున్నావు చూడ నిపుడు. 128

తే. తివిరి కామాంధకారివై తిరుగుప్రోడ
వేమి నీజాడ యింతయు నెఱుఁగరాదు
తెలియఁజెప్పు మటన్న నద్దేవితోడ
నిందురేఖాశిఖామణి యిట్టులనియె. 129

క. పర్వేందువదన విను మే
సర్వజ్ఞుఁడ నహహా మేలు సర్వజ్ఞునిపై
నుర్విని జను లెవ్వారు న
ఖర్వమతిం దలఁగి పోరుగద పరికింపన్. 130

తే. నీలకంఠుండ నే హారినీలవేణి
నీచెలిమిఁ గోరుకొని వచ్చి నిలిచినాఁడ
నౌర మే ల్నీలకంఠుఁడ వైతివేని
కేక లిడుకొంచు వేగంబె గిరికిఁ జనుము. 131

క. క్రీడాకిరాతుఁడను నేఁ
జేడియ యటులైన నీవు జింకలు పులులుం
గ్రోడంబులు గలయడవికిఁ
బోడిమితో వేఁటలాడఁ బొమ్మా నెమ్మిన్. 132

సీ. అబల నేఁ బశుపతి నహహా నీ వట్లైన
నాలమందకు ఱంకె లడరఁ జనుము
స్థాణుఁడ నేను గంజాతాక్షి యబ్బబ్బ
మోడు మాటాడుట చూడ మెందుఁ
బురసంహారుఁడ నేను బోలఁతి నీ వట్లైన
మావీట నుండక మరలి పొమ్ము

పన్నగధరుఁడను బడఁతి నేనట్లైనఁ
బడిగె లెత్తుచు నూళ్లఁ బడి తిరుగుము

తే. భూతనాథుఁడ నేను బూఁబోఁడియట్టు
లేని నలప్రేతభూముల కేగు మిపుడె
కుటిలకుంతల నే మహానటుఁడ నట్టు
లైనఁ బ్రభువుల కడ కేఁగి యాడు మెలమి. 133

క. చిగురాకుఁబోఁడి విను మే
నగవాసుఁడ నట్టు లౌదవినఁ దెక్కలతో
గగనమున కెగిసి చెట్లకు
జగతస్థితి నిలువఁబోక చనుమా వేగఁ. 134

తే. విను విరూపాక్షుఁ డను నేను వనజవదన
యహహా బుధులు విరూపాక్షుఁడైన వానిఁ
జూడరా దని తలుచుగ నాడుచుండ్రు
తొలఁగి వేం చేయు మిఁకఁ బెక్కుపలుకు లేల. 135

తే. అనుచుఁ దా నాడుమాటలకగతనూజ
పొసఁగఁ గల్పించి యుత్తరం బొసఁగుటయును
దలఁకి యాపూర్ణనీహారధామముఖికిఁ
గాలకంఠుండు నమ్మికగా వచించె. 136

తే. తెలివ నే నేమిపాపంబు నెఱుఁగ నీవు
వట్టితప్పులు నామీఁదఁ గట్టి యిట్లు
గలఁక నొందింపనేల యాగ్రహము మాని
వినుము నామాట యొక్కటి వీనులలర. 137

. ననఁబోఁడి నామాట నమ్మకుండితివేనిఁ
జెనకి బెబ్బులివాఁతఁ-జెయ్యిడియెద

గట్టిగాఁ బెనుబాముఁ బట్టి యాడించెద
విషమైన మ్రింగెద వెఱపులేక
కొండగక వడిఁ బెద్ద గుడి సొచ్చి నిలిచెద
నవవీల గోపదం బంటుకొనెద
నంకిలి లేకుండ నగ్గి ధరించెదఁ
బట్టుగా ద్విజరాజు ముట్టుకొనెద

తే. మఱియు నేబాసయైన నేమమునఁ జేతుఁ
గాన నింక నీతలంపులో మాని మాని
నీశిరోమణి నన్ను మన్నింపు మిప్పు
డెలిమితోడుతఁ గదియించి యేలుకొనుము. 138

తే. అనిన నంబిక యొక్కింత యాత్మ నలరి
యారగ నీ కిట్టిబాసలు నచ్చివచ్చుఁ
బలుకు లేటికి రమ్మని తలుపుదీసి
పిలుచుటయు నేఁగి యతఁ డొద్ద నిలుచుటయును. 139

తే. అతనిసంభోగచిహ్నంబు లరసి చూచి
పార్వతీదేవి యిట్లనిపల్కె నహహా
యిప్పుడే నేమిసాపంబు నెఱుఁగనంటి
వెచటి వీచిన్నెలో నాకు నెఱుఁగఁజెప్పుము. 140

క. పసుపును గుంకుమగంధము
నసవంబక నీదుమేన నట్టువదలి యే
బిసరుహాముఖి యంటించెనొ
కసరక నాతోడ నిపుడు గట్టిగఁ జెప్పుమా. 141

వ. అనిన భవుం డిట్లనియె. 142

క. విను మానిని జనులందఱు
వెనుకయ్యను బూజసేయ వెస నాతఁడు నన్
జెనఁగి కవుంగిటఁ బొదవినఁ
దనువున నవి యంటుకొనియెఁ దప్పె నాకున్. 143

తే. కాలకంధర నీమోవిగంటు లేమి
కారణంబునఁ బొదవె నా గౌరి వినుము
మరునితోడ నెదిర్చి సంగర మొనర్చు
తఱిని గోపించి కీరంబు గఱచెఁ జుమ్ము. 144

క. హాటకగిరిధర నీమెయిఁ
గాటుక యంటిన దదేమికారణ మబలా
కాటుక కాదిక లత్తుక
గాటపుగరళప్రభావికాసము సుమ్మీ. 145

క. మే లెంతటినెఱజాణవొ
బాలిగ దత్తురములాడి వంచించెదవో
బాలేందజూట నీమెయిఁ
బూ లంటుకయున్న వేల పొంకక చెపుమా. 146

తే. భామ విను మున్ను శ్వేతుఁ డన్భక్తవరుఁడు
వెలవెలందికిఁ బూల్గొంచు వెడలు నెడల
గొన్ని మహిమీఁద వ్రాలినఁ గోరి వాఁడు
నాకు నర్పింప నవియంటి నాటుకొనియె. 147

క. పన్నగరాజాంగద నీ
కన్నుల కెఱుపేలగలిగె గౌరిభక్తుల్
ని న్నర్ధరాత్రివఱకు
నన్ను జ్జాగరణ మునిచినం బొసఁగె నిటుల్. 148

తే. అంచు నిరువురు నిట్లు భాషించుతఱిని
నీలకంఠుండు మోహంబు నిలుపలేక
సర్వమంగళచరణకంజములమీఁద
వ్రాలె నన్నుద్ధరింపవే వనిత యనుచు. 149

క. వ్రాలినఁ గనుఁగొని గిరిసుత
మే లహహా జాణ వగుదు మెచ్చితి నిన్నున్
లే లె మ్మనుచుఁ గవుంగిటఁ
గీలించి విభునిమనోజకేళిం దేర్చెన్. 150

వ. అట్లుమామహేశ్వరు లన్యోన్యానురాగంబు లినుమడింప నఖండమహావైభవంబునఁ బ్రమోదింపుచుండి యొక్క నాఁడు. 151

క. వేడబ మొప్పఁగ నెత్తం
బాడుచు నున్నంత గిరిజయాటకు లోనై
యోడి శివుఁ డూరకుండినఁ
గ్రీడామోదమున గౌరి కిలకిల నవ్వెన్. 152

వ. అప్పు డమ్మహాదేవి యౌద్ధత్యంబు సహింపలేక శివజటాగ్రంబున గంగ తొంగిచూచిన దానిం గనుంగొని భవాని శంకరుని మొగంబు చూచి యిట్లనియె. 153

తే. ఏమిపాపం బొకింత నే నెఱుఁగనంటి
వహహా నీకెంజడలలోన నడఁగి తొంగి
తొంగి చూచుచు నున్న దేధూర్తసతియొ
దానిచందంబు తెలుపుమా తడయ కిపుడు. 154

క. ముసు దారుకాననంబున
మునిదారలభ్రమలఁ బెట్టి మోహింపఁగఁ జే
సినమేటివన్నెకాఁడవు
నినుఁ జెప్పఁగనేల యింక నేఁడు వృషాంకా. 155

క. భల్లాణరాజుకూరిమి
యిల్లాలై కడిఁదిహొయల నింపొందినయా
చెల్లాంబం గామించిన
బల్లిదుఁడవు నీహొరంగు పలుకం దరమే 156

తే. సురలు నసురులు నమృతంబు నరుదుకొనఁగ
లేక పోరాడుచోఁ జక్రిలీల నొక్క
నెలఁతయై పంచి యిడుచున్న నీవుదాని
వెంటఁబడి పర్వెత్తవె వేడబమున. 157

వ. అని మఱియు నిట్లనియె. 158

ఉ. అక్కట నీవు నన్నిటుల నారడిఁబెట్టి కలంపఁ జూచుటల్
నిక్కముగా మదిం దెలియనేరక యూరక మోసపోతి నిం
కెక్కడిసత్యశౌచములు హీనకులంబువెలందిఁ బెండ్లియై
డక్కగ నెత్తిఁబెట్టుకొని టక్కులు వల్కెద వేమిచెప్పుదున్.

తే. తివిరి నామీఁద నొక్కతె దెచ్చి యిపుడు
లేదు లేదని బొంకుపల్కెద వయారె
దానిఁ గ్రిందికి దించి నాదఱిని నిల్పి
మాటలాడించుమా యింక మఱుగులేల. 160

క. తగులమి రెయొకచోఁ దక్కరి
వగ లొకచోఁ బెరయఁ జెలులు వంచింతురు గ

ట్టిగ నెట్టిబాసచేసిన
మగవారిని నమ్మరాదు మాట లికేలా. 161

వ. అని పలుకుచున్నసమయంబున. 162

క. నిగిడెడ కొరకొరతోడన్
మొగ మించుక చేవ్రురింపఁ బోణిమి నబ్రం
బుగ నగభవనునిగడితేఁపు
సిగలోపలనుండి గంగ చివ్వున నుతికెన్. 163

వ. అప్పుడు భవాని దానిం గనుంగొని యిట్లనియె. 164

క. ఎక్కడిదానవె నీ విటు
లక్కజముగ నాహృదీశునొఁదలపైఁ బెం
పెక్కఁగ వసించి యిప్పుడు
చిక్కన నుతికితివి బుద్ధి సెప్పెదఁ జుమ్మీ. 165

క. నీ వెక్కడ నే నెక్కడ
భావజహరుఁ డెచట నోసి పరఁగంగ నీఁకన్
గావర ముడిగి తటాలున
వేవేగ మదాలయంబు వెలువడి పొమ్మా. 166

క. పోకుంటివేని నిన్నున్
రాకాసులవంటిప్రమథరాజోత్తములన్
దీకొలిపి ప్రోలు వెడలఁగ
నూకింతుఁజుమీ చలంబు నూలుకొనంగన్. 167

వ. అనినం బార్వతీదేవికి భాగీరథి యిట్లనియె. 168

తే. అక్కరో యిట్టిమాటల నాడనేల
నీవు శంభునిఁ గోరి మున్నేవిధమున

వచ్చి చేకొనియున్నావో వాలెముగను
నేను నటువలె వచ్చినదానఁ జువ్వె. 169

క. చిగురాకుఁబోఁడ్లకెల్లను
మగఁ డేమారగను మేటిమన్కవతోడన్
సగమేన నిల్పుకొన్నను
సిగలో నిడుకొన్నఁ జెల్లుఁగదమ్మా. 170

వ. అనిన భవాని దాని కిట్లనియె. 171

క. మే లహహా యెంతటిగ
య్యాళివె చేరినటులుండ కఱచెదవు కదుం
గూలికి వచ్చినయాతఁడు
పాలికిఁ బట్టినక్రియ న్విపర్యాసముగన్. 172

ఆ. అడుగునిలుపనీక వడిఁగొట్టుచూపుచు
నింగిముట్టి మిగులఁ బొంగెదేమి
గట్టివాతనంబు గనఁబడనానె నీ
నిలువు నీరుగాను నీచురాల. 173

వ. అనిన గంగ యిట్లనియె. 174

ఆ. పెద్దదాన ననుచుఁ బెళపెళనార్చుచు
జగము లెల్ల మ్రింగఁజాలునట్టి
సత్తిరూపు పూని జడిపింపవచ్చెదు
కినుక నిగుడ నీవుగిరితనూజ. 175

వ. అనిన హైమవతి యిట్లనియె. 176

తే. నిచ్చనిచ్చలుఁ బంకంబు నివ్వటిల్లఁ
గోరి మితిలేనిజలచరకోట్లలోన

నడచుకొనియుండు చెనటు వయారె నీవు
నన్ను నెదిరింప నెట్టిదానవె తుటారి. 177

ఆ. వక్రగతులచేత వాలెంబుఁ బెక్కుత్రో
వల వెలుంగుచుండి కలఁక నిగుడఁ
దూఱి మొరసెదేమి దుష్కీర్తి బొడవి నీ
బ్రతుకు బైలుగాను బలువదాన. 178

క. అనిన న్జాహ్నవి గిరిసుతఁ
గనుఁగొని యిట్లనియె నీవు ఘనురాలవె మేల్
మనుచండికవై యొక కా
ఱెనుపోతును జంపి దానిహితమతిఁ గొనవే. 179

తే. సకియ యూరూర దేశదేశములఁ బెద్ద
సత్తివై నిల్చి కూళ్లను శాకములను
గోళ్లు గొరియలు గుగ్గిళ్లు కుడుము లట్లు
దనివిసన మెక్కుకడుపుబద్దరివి గదవె. 180

వ. అనిన నంబిక యిట్లనియె. 181

తే ఓసి గయ్యాళి నీ కింతరోస మేల
చెడుగుజాలారివానింటఁ బొడమి బిట్టు
చేఁప జెల్లలు దిని మేను చెందకున్న
పరికెతవు నీవు నాతోడ సరియె చెపుమ. 182

వ. అనిన భాగీరథి యిట్లనియె. 183

తే అప్పరో యింక నీగుట్టు చెప్పనేల
కల్లు గంజాయి నంజుడు నెల్లప్రొద్దు

బాళిగాఁ దిను కడజాతివానియింటఁ
బుట్టితివొ లేదొ చెప్పుమా గట్టిగాను. 184

వ. అని యిత్తెఱంగున నిరువురు వాదింపుచున్న సమయంబునఁ
గాత్యాయనీదేవి మహాదేవుని మొగంబు సూచి యిట్ల
నియె. 185

తే. అకట నామీఁద నీవిపు డొకతెఁదెచ్చి
వాద మొదవించి యెఱుఁగనివానిఁబోలెఁ
జూచుచున్నాఁడ వింకనీచొప్పు దెలిసె
నంచుఁగోపించి చనుచున్న నళికి హరుఁడు. 186

తే. వనితపదపద్మ ములమీఁద వ్రాలి నేను
దప్పుసేసితి లోఁగొమ్ము దయ దలిర్ప
నిందుముఖి యింక నెలఁతుక లెందరున్న
నీవు పట్టంపుదేవివిగావె చెపుమ.                187

వ. అని బుజ్జగించి గాఢాలింగనంబు గావించి గంగచేత భవా
నికి మ్రొక్కించి వారిద్దఱిం గనుంగొని యిట్లనియె. 188

ఆ. ఒక్కచోటఁ బుట్టి యొక్కనిఁజెంది మీ
లోన మీకు వైరమూని యిట్లు
పోరొనర్పనేల పొలఁతుకలార మీ
రొద్దిమీఱఁ గూడియుండుఁ డింక. 189

క. అని నగసుత నర్ధాంగం
బున జాహ్నవి నుత్తమాంగమున నిడి కమలా
సనముఖ్యులు గొలువఁగ శివుఁ
డెనరొదవనిశివి జగము లేలుచు నుండెన్. 190

సీ. గడితంపుముప్వన్నె కడిఁదిదుప్పటియును
బసమీఱుబంగారుపట్టుచేల
రుచిరాభినవచారురుద్రాక్షమాలికల్
మురువైనసవాఁజుమంజిముత్తెసరులు
భువనాభిరామవిభూత్యంగరాగంబు
సారకాశ్మీరపటీరచర్చ
భూరిశోభాకీర్ణభుజగభూషణములు
మణిమయతపనీయమండనములు

తే. పాండురారుణవర్ణవిభ్రాజమాన
గాత్రమును గల్గి శృంగారగరిమ నలరు
నర్ధనారీశ్వరేశ్వరుఁ డభవుఁ డిందు
మౌళిభక్తాళినయనంబు మనుచు చుండు. 191

తే. అనుచు భీష్ముండు పాండుపుత్త్రునకు గంగ
కథ యెఱింగింప నలరి యాపృథుబలుండు
నిటలలోచనుఁ దలఁపున నిలిపి మ్రొక్కి
యతితరామోదహృదయుఁడై యలరుచుండె. 192

తే. శాలివాహనశకవర్ష సంఖ్యవసున
వాంగశశిసంజ్ఞ నలరు ధాతాబ్దమునను
దగ రచించినయీకృతి ధరణియందు
నాసుధాకరతారార్క మగుచు నుండు. 193

క. వినుఁ డీకృతి ముప్పదియొక
దినములకుం జెప్పినాఁడ దేవునియాన౯

జనులెన్నఁ గుక్కుటేశ్వరు
ఘనకరుణాదృష్టివలనఁ గవివరులారా. 194

క. ఈకథ చదివిన వ్రాసిన
బ్రాకటముగ విన్న జనులపాపము లడఁగుఁ
జేకురు సకలసుఖంబులు
శ్రీకంఠునికరుణచేత సిద్ధము గాఁగన్. 195

ఆశ్వాసాంతము.

చ. అరిబలదర్పశోషణ మహాహివిభూషణ సత్యభాషణా
సరసకృపానిరీక్షణ విచక్షణరక్షణ పుణ్యలక్షణా
హరిముఖనిర్జరావన విషాగ్నినిషేవన విశ్వభావనా
సరసిరుహాక్షసాయక లసత్ఫలదాయక లోకనాయకా. 196

తోటకవృత్తము.—

శివశంకరశాశ్వతశిష్టరతా
భవభర్గసమాశ్రితభక్తహితా
దివిషజ్జనసేవిత ధీమహితా
వివిధాగమవందిత విశ్వనుతా. 197

మాలినీవృత్తము —

ప్రముదితమునిజాలా భక్తలోకానుపాలా
శమసమదవిభంగా చారుగంగోత్తమాంగా
ప్రమథగణసనాథా పార్వతీప్రాణనాథా
కుముదహితకలాపా కుక్కుటాధీశరూపా. 108

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్ష నిరీక్షణ సంలబ్ధ సరసకవితా సామ్రాజ్యధురంధర, ఘనయశో బంధుర, కౌండిన్యసగోత్రపవిత్ర, కూచిమంచి గంగనామాత్యపుత్ర, సకల సంస్కృతాంధ్రలక్షణకళాకౌశలాభిరామ తిమ్మకవి సార్వభౌమ ప్రణీతంబైన శివలీలావిలాసంబను శృంగారరస ప్రబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

శివలీలావిలాసము సమాప్తము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి.
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1930.

# ఆంధ్ర గ్రంథములు.

## పద్యకావ్యము.

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | ప్రతి 1-కి | రూ. | అ. |
| అచ్చతెనుగురామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 10 |
| అడవిమల్లెలు, ఎనమండ్ర నారాయణమూర్తిగారివి | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 14 |
| అప్పకవీయము, శ్రీగిడుగు రామమూర్తి పంతులుగారి విమర్శతో నున్నది. | ... | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) | ... | 0 | 4 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది | ... | 5 | 8 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండుసంపుటములు | ... | 7 | 8 |
| డిటో 3 సంపుటములు | ... | 9 | 0 |
| శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:— | | | |
| 7 సంపుటముల ప్రతి | ... | 14 | 0 |
| 3 సంపుటముల ప్రతి | ... | 13 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆరణ్యపర్వము ,, | ... | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | ... | 2 | 0 |
| శాంతిపర్వము | ... | 2 | 0 |

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము ... | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము ... | 5 | 8 |
| యుద్ధపంచకము స్త్రీపర్వము ... | 3 | 12 |
| శాంతిసప్తకము ... | 3 | 12 |
| ఆదిపర్వముమాత్రము, పెద్దచ్చు, చిన్నసైజు ... | 1 | 8 |
| ఆంధ్రభారతము, ఉద్యోగపర్వము ... | 0 | 8 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాదిసూర్యనారాయణశాస్త్రి ... | 0 | 8 |
| అనందరంగరాట్ఛందము, కాలికోబైండు ... | 1 | 8 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము ... | 5 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము ... | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము, కావ్యస్మృతితీర్థ జనమంచి శేషాద్రిశర్మ కృతము, 3 సంపుటములు ... | 12 | 0 |
| డిటో 7 సంపుటములు ... | 14 | 0 |
| ఆంధ్రభాషాభూషణము ... | 0 | 2 |
| ఆంధ్రనామగంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము ... | 0 | 12 |
| ,, కాలికోబైండు ... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 0 | 8 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక ... | 0 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కనికూర్పు గిల్టుబైండు ... | 2 | 0 |
| ఉత్తరహరివంశము, నాచనసోమనాథకృతము ... | 1 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవిది ... | 0 | 6 |
| కవికర్ణరసాయనము (మాంధాతచరిత్ర) ... | 1 | 8 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు ... | 1 | 14 |
| కవిజనాశ్రయము, భీమునిఛందస్సు ... | 0 | 12 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు ... | 2 | 4 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| కాశీఖండము, చక్కనికూర్పు | ... | 1 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 12 |
| కుచేలోపాఖ్యానము సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభుకృతము | ... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 8 |
| గద్యపద్యసంగ్రహము, జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారిచే సమకూర్పబడినది | ... | 0 | 10 |
| డిటో గోత్రి సూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 0 | 12 |
| గరుడాచలము, యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 2 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము. కవనము మిక్కిలిసొంపు; పీఠిక అతివిపులము. | | 7 | 8 |
| చంద్రరేఖావిలాపము, కూచిమంచి జగ్గకవిది | ... | 0 | 14 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము, సాధారణప్రతి | ... | 1 | 6 |
| డిటో మేలుప్రతి, గ్లేజు కాగితములది | ... | 1 | 10 |
| చెన్నబసవపురాణము, పావకవికృతము | ... | 1 | 2 |
| ఛందోదర్పణము, (అనంతునిఛందము) | ... | 0 | 14 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము | ... | 1 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 12 |
| దశావతారచరిత్ర, చక్కనికూర్పు | ... | 2 | 0 |
| దసరాపద్యములు | ... | 0 | 1 |
| ధ్రువోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) | ... | 0 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు | ... | 0 | 10 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| తెనుఁగుసమస్యలు | ... | 0 | 2 |
| నలచరిత్ర, ద్విపద | ... | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము, మేలుప్రతి | ... | 1 | 0 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 4 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | ... | 0 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 8 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగ్గడ, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 6 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 2 |
| డిటో వేంకటనాథరాజకవికృతము | ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 10 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 10 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 14 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు క్రొత్తకూర్పు | ... | 0 | 8 |
| బసవపురాణము, పిడుపర్తి సోమనాథప్రణీతము | ... | 2 | 4 |
| బ్రహ్మోత్తరఖండము, శ్రీధరమల్లెవేంకటరామకవి | ... | 1 | 0 |
| భోగినీదండకము, బమ్మెరపోతనకవి | ... | 0 | 1 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము | ... | 1 | 2 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్లరామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలు కాకితములమీద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రించియున్నారము. | ... | 2 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| లంకావిజయము, (రావణదమ్మీయము) సటీక, పిండిప్రోలు లక్ష్మణకవి కృతము ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు ... | 1 | 8 |
| వసుచరిత్ర విమర్శనము, శ్రీ చినసీతారామస్వామి శాస్త్రి కృతము, అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుగలవు ... | 1 | 0 |
| వసుచరిత్ర, సటీక, రామరాజభూషణ ప్రణీతము అనేక నూతనాంశములుగల చక్కని క్రొత్తకూర్పు ... | 4 | 0 |
| వసిష్ఠజనకసంవాదము, యామిజాల శేషయ్యకవి ... | 0 | 8 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద, తరిగొండ వెంకమ్మ ... | 1 | 4 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవి ప్రణీతము ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు ... | 1 | 10 |
| విష్ణుపురాణము, వెన్నెలకంటి సూరన్న, క్రొత్తకూర్పు ... | 2 | 8 |
| విశ్వగుణాదర్శము, పాతప్రతి ... | 0 | 8 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవికృతము ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు ... | 0 | 12 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది ... | 0 | 5 |
| విరాటపర్వము, పద్యకావ్యము, ప్రథమాశ్వాసము ... | 0 | 8 |
| డిటో ,, ద్వితీయాశ్వాసము ... | 0 | 8 |
| డిటో ,, తృతీయాశ్వాసము ... | 0 | 12 |
| వీరభద్రవిజయము, బమ్మెరపోతరాజకృతము ... | 0 | 12 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మ ... | 1 | 0 |
| వేంకటాచలమాహాత్మ్యము, కాలికోబైండు ... | 1 | 6 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు ... | 0 | 6 |
| డిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో ... | 1 | 4 |
| వేమనపద్యములు, 2728 పద్యములు, కాలికోబైండు ... | 1 | 12 |
| వేమనశతకము ... | 0 | 2 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 2 |

| ప్రతి 1-కి | రూ. | అ. |
| --- | --- | --- |
| వేమనపద్యములు, 2728 పద్యములు, తాత్పర్యసహితము, ఇందు గ్రంథ విమర్శ, కవిజీవితము మొదలగునవి చేర్పఁబడినవి. చక్కని క్రొత్తకూర్పు | 3 | 8 |
| వైశ్యపురాణము, శ్రీగురుభాస్కరాచార్యకృతము | 1 | 4 |
| శతకంఠరామాయణము, క్రొత్తకూర్పు, మల్లనకవికృతము | 0 | 10 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము | 0 | 12 |
| డిటో కాలికోబైండు | 1 | 2 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు | 1 | 0 |
| ,, కాలికోబైండు | 1 | 6 |
| శృంగారశాకుంతలము, పినవీరభద్రకవి | 0 | 12 |
| డిటో కాలికోబైండు | 1 | 2 |
| శివధర్మము, పద్యము, తామరపల్లితిమ్మయ్య | 0 | 12 |
| సమీరకుమారవిజయము | 1 | 4 |
| సప్తమస్కంధము, సాధారణప్రతి, (భాగవతము) | 0 | 6 |
| డిటో టీకాతాత్పర్యసహితము, కాలికోబైండు | 1 | 4 |
| సహస్రకంఠరామాయణము, రామావఝ్ఝుల కొండయ్యకవి | 0 | 12 |
| సారంగధరచరిత్రము, చేమకూర వేంకటకవికృతము | 0 | 8 |
| సానందోపాఖ్యానము, శ్రీశివరామకవి విరచితము | 1 | 0 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజున ముద్రించినారము. టీక, వివరణము మిక్కిలి విపులము. ఈవఱకు ప్రకటితమైన ప్రతులకన్న బాగుగనున్నది. | | |
| మేలుకాగితములు, గిల్టుపేరు, కాలికోబైండు | 3 | 8 |
| సులక్షణసారము, సటీక | 0 | 8 |
| డిటో కాలికోబైండు | 0 | 12 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.